సంపుటము 3] అక్టోబరు 1916 [సంచిక 4

# బాలమిత్ర



## దేవుని ప్రేమ

ప్రియమైన చిన్నపిల్లలారా! దేవుని కెంత ప్రేమగలదో విని నేర్చుకొని యున్నారా? దేవుడు మిమ్ము నెంతగా ప్రేమించి విద్యాబుద్ధుల నిచ్చుచున్నాడో మీరు గ్రహించి యున్నారా? అవును. మిమ్మును ప్రేమించుచున్నాడు. ప్రియ చిన్నపిల్లలారా! దేవుడింత దయగలవాఁడైయుండగా మీరింకా

అనుమానించెదరా? ఇంకా ఆలస్యము చేయుదురా? పరలోకములో దేవుని దూతలతో నుండగోరరా? మీరు నరకములోకి వెళ్లు విశాలత్రోవనే కోరెదరా? ప్రియ పిల్లలారా! ఇకను మళ్లుడి. దేవునికి మీ చిన్న మనస్సుల నియ్యుడి! మీయొక్క చిన్న పాపముల కొరకు విచారపడి, అధైర్యపడవద్దు. బిడ్డలారా! మీరు మీ ప్రభువైన యేసువైపు చూడుడి. ఈ దినము నుండియు ఈ క్షణము నుండియు యేసు మీపాపములు మన్నించునని నమ్మి ఆయనను పట్టుకొని మంచిపిల్లలుగా ప్రవర్తించుడి. దేవుని కుమారుడు మన పాపములకొరకు చనిపోయెను. అందువల్లనే మనకు రక్షణభాగ్యము దొరికెను. ప్రియ బిడ్డలారా, మీరు మీతండ్రిని మరువక మంచిబిడ్డలుగా నుందురని నమ్ముచున్నాను.

---

# ఆనందాకర

విజయనగరములో ఆనందాకర యను ముద్దుబాలికగలదు. చిన్ననాటనే తల్లిని పోగొట్టుకొన్నను మిగుల ప్రేమగల తండ్రితో సంతోషముతో కాలము గడుపుచుండెను. తండ్రి యొక సంఘుపాదిరి. క్రీస్తునకు పూర్వము సీమనుండి కొన్ని బహుమతులు ఆ పట్టణస్థులకు వచ్చెను. బహుమతుల

పెట్టె తెరచిచూడ ఆనందాకరకు కుంటివారలు నడుచుటకు సాయపడు చంకకర్రలు బహుమతిగా వచ్చెను. అంత నా చిన్నది ''నాయనా! నాకు చిన్నబొమ్మ కావలెను. నాకీచంక



కర్రలు వలదు''ని తండ్రితో మిగుల ఏడ్చుచు చెప్పెను. అందుల కాపెతండ్రి ''అమ్మా! నీకు ఎద్దియో ఒక బహుమానము వచ్చెను. ఏమియు రాకున్న విచారపడవచ్చును. అయితే నీకొక బహుమతి యున్నది గాన సంతసించుమని యోదార్చెను. అప్పటినుండి యాచిన్నది యెంత కష్టము, దుఃఖము, నష్టము వచ్చినను అందుకు ఏమైనా సంతోషము గలదా యని పరిశీలించి తెలుసుకొని సంతసించునది. సద్గుణులు

తమ సద్గుణములితరులకును అలవడ ప్రయత్నించి తమ మనోరథమును సఫల పరచుకొనునట్లే చిన్నదికూడా ఇతరులకు ఎల్లప్పుడు సంతోషించుమని నేర్పుచుండెడిది. ఈ చిన్నదాని తండ్రి వేదగ్రంథమున ననేక సార్లు సంతోషించుమని చెప్పబడియున్నది గాన మన యావత్తు చింతల వదలి సంతసింతమని ఆనందాకరకును, ఇతరులకు చెప్పుచుండువాడు. ఈ భక్తుడు చెప్పినట్లు ఆ పట్టణవాసులు సమస్త భారముల ప్రభువుపై మోపి ఆయనయందు సంతసించుటకు నేర్చుకొనిరి.

ఇట్లుండ ఆనందాకర తండ్రి యొకనాడు ప్రభుసన్నిధికి పిలువబడియె. పాపము! ఆనందాకరకు పదునొక్క వత్సరము మాత్రమే. అనాథ బాలికగా విడువబడిన ఈమెను ఆ పట్టణ జనానాస్త్రీలు చేర్చుకొని కొంతకాలమువరకు పోషించిరి. వారు ఈ చిన్నపిల్లకు భీమవరమున ఒక పినతల్లి గలదని విని, ఆమె కీపిల్లసంగతి తెలియజేయగా నామె యా పిల్లను పోషించుట తన విధియని ఒప్పుకొని పిల్లను తన యొద్దకు రప్పించుకొనియె. ఈమెకుమనుష్యసహవాసమే పనికి రాకున్నను, తన విధులను లోపము లేకుండ సానుకూల పరచుకొను నభ్యాసముగలది. సదా చిరాకుపడునది. ఆనందాకర తనకు విధించబడిన పనుల జేయునప్పుడు ఆమె శిక్షించినను ఆనందాకర "పిన్నీ! నాకు చాల సంతోషమనుచుండునది."

ఒకనాడు అన్నమున కాలస్యముగా వచ్చినందున ఆమె పినతల్లి మేడలోఁ గాక వంటయింట అన్నముతిన నాజ్ఞాపించగా, నది తనకు మిగుల అవమానమని యెరిగియు వంటకత్తెతో "వెంకమ్మా! ఎంత సంతోషము. ఇక్కడ వంటయింటిలో నాభోజనము పుచ్చుకొనుటవలన నీతో ఈకాలము గడుప నాకు ప్రాప్తించెనుగా" అని అనెను. ఇట్లు ఈ చిన్నది ప్రతిదానికి సంతోషము, సంతోషము అనుట పినతల్లివిని ఆలాగు అనవలదని పెక్కుపర్యాయములు కోపపడెను. గాన భయమువలన పినతల్లి యెుద్ద అనలేక పోయినను భీమవరవాసుల కందరికి యెట్టి కష్టము ప్రాప్తించినను సంతసించవలెనని తన సంతోషకర బ్రతుకునే ఉదాహరణముగ చూపి యెల్లరకు నేర్పించెను. తనతోడి వారలకు వృద్ధులకు రోగులకు మనోవ్యాకులత గల వారికి అందరికి సంతోషముగా నుండ నేర్పెను. అంతా సంతోషముగా నుండ నేర్చుకొని వారికి దుఃఖమైనను, నష్టమైనను కలిగినను ఎంతసంతోషము. కొంచెము నష్టమే. అయితే పర్వాలేదు. అంతా సరిగా నున్నందులకు సంతసింతమని చెప్పుచు ఆనందించుచుండువారు.

ఇట్లుండ నొకనాడు ఆనందాకర పాఠశాలనుండి ఇంటికి వచ్చుచుండగా వేగముగా పోవుచున్న బండి యామె మీదుగా పోయినందున లేవ నశక్తురాలై మిగుల జబ్బుతో పడియుం

డెను. ఎన్ని మాసములు గడిచినను, ఎంతసొమ్ము ఖర్చుపెట్టినను కాళ్లు నడువను రావాయెను. ఇట్టి సమయమున నామె పినతల్లి చాలాప్రేమగా మాట్లాడుచు ఆమెకు కావలసినదెల్ల నిచ్చుచు మిగుల జాగ్రత్తతో చూచుచుండెను. ఆనందాకర “పిన్నీ నేనిట్లు జబ్బుపడినందుకు చాలా సంతోషము. ముందునకన్న నీవు నన్ను మిగుల ప్రేమించుట కీజబ్బేమూలమాయెన”నిచెప్పి సంతోషపడెను. చూడవచ్చిన వారంతా ఈ అమ్మాయి దగ్గరనే మిగుల సంతోషముగా నుండనేర్చి “ఎంత సంతోషము”ను మాట వినియోగించుచు అధికముగా సంతసపడుచు ఆనందాకరతో ముచ్చటించుచుండ ఇతరులతో కలసిమెలసి సంతసించి యెరుగని ఆనందాకర పినతల్లియు సంతోషించ నేర్చుకొనియె, దైవానుగ్రహమువలన ఆనందాకర దినములు గడుచుచుండ నడవశక్తురాలాయెను. ఆనందాకర అందరికి సంతోషించుట నేర్పించెను. చదువరీ! ఆనందమునకు ఆకరము అని అర్థమిచ్చు పేరు పెట్టుకొన్నపిల్ల తన నామము సార్థక నామముగా జేసికొనియె. మీరు ఇతరుల సంతోషపెట్ట ప్రయత్నించుచున్నారా? ఈ చిన్నది అనేకుల తన సంతోష ప్రవర్తనచే సంతోషితుల జేసినట్లు మీరును సంతోషముగా నెల్లప్పు డుండుటచే నితరుల సంతోషితులజేయుడు.

---

# నీవు పూర్తిగా నశించినవాడవు కావు



ఒకనాఁడొక భక్తురాలు తాను నివసించుచుండిన పట్టణమందలి సారాయంగడికి దగ్గరగానుండు వీధిగుండ బోవుచుండెను. అంగడివాఁడు, బాగుగా త్రాగియుండిన యొక పడుచువానిని బయిటికి మెడబట్టి గెంటుట నామె జూచెను. అతనివిషయమై మిగుల చింతించి వానియొద్దకు బోయి తనచేతి నాతని భుజముపై మెల్లగ నానించి “అయ్యో నీకేల యిట్టి దురవస్థకలిగినది? ఇటువంటి దూషణమాటల పొందుట కేమిజేసితివి?” అని యడిగెను. అతడు ఆమె చక్కని స్వరమును విన్నవెంటనే ఉలికిపడి వణక నారంభించెను. కొన్ని నిమిషములైనవెనుక నత డామెను నిదా

నించి చూచి "అమ్మా! మిమ్మును చూచి నా తల్లియని భ్రమజెందితిని. ఆమె స్వరమునే విన్నట్లుండెను. అయ్యో! ఆమె చనిపోయి చాలకాలమైన దన్నెను. "నీకు ప్రేమగల తల్లియుండెనా?" అని ఆమె యడిగెను. ఆ ప్రశ్నకు వానికి బహు దుఃఖము వచ్చెను. "నా తల్లి చాలమంచిది. నన్ను బహుగా ప్రేమించెను. ఆమె పోయినప్పటినుండి నా కీలోకములో నున్నవన్నియు పోయెను. నేను నశించినవాడను. పూర్తిగా నశించినవాడను" అని ఘోరముగా నేడ్చెను.

ఆమె "కాదు కాదు. నీ వెన్నటికిని పూర్తిగా నశించినవాడవు కావు. దేవుడు ప్రేమాస్వరూపి. కనికరము గలవాడు. పాపులలో మహా ఘోరపాపిని సహిత మాయన ప్రేమమార్చగలదు." అని ఆమె స్పష్టముగా వానికి జెప్పెను. ఆ మాట లాతని హృదయమున బాగుగా నాటినవి. ఆమె మరికొంచెమునే పతనితో మాటలాడి వెళ్లిపోయెను. గాని అత డామెను వెంబడించి ఆమె ప్రవేశించిన యింటి పైవిలాసమును వ్రాసికొని ఎక్కడికో వెళ్లెను.

కొంతకాలమున కా భక్తురాలియింటి కొకనా డొక క్రొత్తవాడు వచ్చెను. వాని వస్త్రము లతి శుభ్రముగా నుండెను. అతని జూచినవెంటనే, వా డొక గొప్పయింటి బిడ్డ యని తోచునట్లుండెను. ఆమెను జూచి కన్నులు నీటితో

నిండగా, వినయముతో వంగి సలాము జేసెను. ఈత డెవరా యని ఆమె మిగుల ఆశ్చర్యపడజొచ్చెను గాని అత డామె సందేహము పోగొట్టి, ,,అమ్మా మీ మాటలచే రక్షింపబడిన వాడను. మీలో నాతల్లి పోలికయుండుటచేతను, మీరు నా యాత్మకుచేసిన మేలునుబట్టియు మీకు మిగుల కృతజ్ఞుడను'' అనెను. పూర్తిగా నశించినవాడవు కావను హెచ్చరికె మాట లతనితల్లి స్వరమువలె ఎల్లప్పుడు వినబడుటచే వాడు మార్పు బడి నిత్యజీవము నొందెను.

---

# ప్రకృతి పాఠములు

### 26-వ పాఠము

## మెదడు, నాడులు

శరీర మేలాగు ఏర్పడునో ఇదివఱకు దెలిపియుంటిని. ఈ పనిని రక్తము చేయుచుండునని నేర్చుకొన్నాముగదా. ఈరక్తము వలననే శరీరమందలి అన్నిభాగములు ఏర్పడుచున్నవి. మనము తిను అన్నము రక్తమగుచున్నవి. మనము పీల్చుగాలి ఈ రక్తమును శుభ్రపరచుచున్నది. గుండెయు ధమనులు శిరలునుకలిసి రక్తమును శరీరముయొక్క అన్ని భాగములకు పోవునట్లు చేయుచున్నవి. ఇందువలన శరీరము

వృద్ధినొందుచు ఆరోగ్యకరమగు స్థితిలో నుంటున్నది. ఎందు వలన శరీరమిట్టి వృద్ధినొందవలెను? నీశరీరము మనస్సు



యొక్క నివాసమైయున్నది. ఈ సంగతిని నీవు మరువ కూడదు.

శరీరము మనస్సు నివసించు ఇల్లు. అది ఇల్లుమాత్రమే గాదు. తలలో మనస్సున్నదని చెప్పవచ్చును. తల శరీరములో నొక చిన్నభాగమై యున్నది. మనస్సు శరీరములో

ప్రతి అవయవముచేతను పనిని జరిగించుచున్నది. నీ చేయి కదలినప్పుడు నీమనస్సు దాని నుపయోగించినది. నడచునప్పుడది కాళ్లను చేతుల నుపయోగించుకొనుచున్నది. నీవు చూచునప్పుడది నీకన్నుల నుపయోగించుచున్నది. ఇదేలాగున అన్ని అవయవములచేతను పని జేయించుచున్నది.

శరీరమనగా మనస్సు ఉపయోగించు వివిధములగు మరలు గలిగిన యంత్రశాలయని చెప్పవచ్చును. ఈ యంత్రశాలయందు జరుగు పనులెట్టివో కొంతచూతము.

నీచేతి నెత్తుము. అది పైకిపోవునట్లు చేసినదేమిటి? వాటికి కండరములని పేరు. అవి దానిని లాగినవిగాన చెయ్యి పైకెత్తబడినవి. వాటి నాలాగు చేయించిన దేమిటి? అలాగు జరుగవలెనని నీవు తలంచితివి. నీమనస్సే అలాగు జేయించెను.

మనస్సు, కండరములలో లేదు. అది నీతలలో నున్నది. అయితే కండరములచేత నదియెట్లు పనిజేయించును. నీ వింటిలోనుండి బయలుదేరి పనివాండ్రకు అదిచేయుము, ఇది చేయుము అని చెప్పినట్లు, మెదడులోనుండి బయలుదేరి అన్నికండరముల యొద్దకు వెళ్లి చెప్పుచుండునా? లేదు. అదెప్పుడును మెదడులోనే యుండును. అక్కడనుండి శరీరముయొక్క ప్రతిభాగమునకుబోవు తెల్లని దారముల వంటివి దేహమంతటగలవు. వీనికి నాడులనిపేరు. వీనిద్వారా

మనస్సు కండరములకు కబురుజేయును. అవి మనస్సు జెప్పినట్లు నడుచుకొనును.

నాడులు టెలిగ్రాఫు తీగలవలె పనిజేయును. మెదడు మనస్సుయొక్క టెలిగ్రాఫు ఆఫీసు. మనస్సీ లఫీసులో నుండి నాడులనబడు తంతులద్వారా కబురులను పంపుచుండును. తంతి ఆఫీసులో విద్యుత్ వలన కబురులు పంపబడునుగాని, మెదడునుండి నాడులద్వారా కబురు లేలాగు పోవుచున్నవో ఎవరికిని తెలియదు.

తంతి తీగెలు తెగిపోయినయెడల ఆఫీసునుండి ఆయా స్థలములకు కబురు లేలాగు వెళ్లవో అదేలాగున శరీరములో నొక భాగమునందలి నాడులు తెగినయెడల కబురులు శరీరములోను పోజాలవు. యంత్రశాలయందు పని జరుగవచ్చును. తీగెలగుండా కబురు వెళ్లవచ్చునుగాని, తెగిన స్థలమునకు వచ్చినప్పు డక్కడనుండి అదెంతమాత్రమును ముందుకు పోనేరదు. అదేవిధముగా నీచేతికి గాయముతగిలి చేయి తెగినయెడల, కండరముల కెంతమాత్రము కబురు రాదు. చెయ్యి ఎత్తవలెనని మనస్సెంత విస్తారము కబురు జేసినను, లేవనెత్త లేకపోదువు. ఈ నాడులలో రెండు తరహాల నాడులుగలవు. దీనినిగురించి వచ్చేపాఠములో విస్తారముగా నేర్చుకొందము.

# బైబిలు పిల్లలు

## మోషే

ప్రియ బాలమిత్రులారా! మోషే బాల్యమును గురించి, పెద్దవాడైన పిదప ఐగుప్తువదలి పారిపోవుటను గురించి, మన మిదివరకే చదివియున్నాము. ఇతడు మరల నెట్లు ఐగుప్తునకు ప్రభువుచే గొప్పపనిమీద పంపబడెనో విచారింతము. మోషే కొండకు సమీపమున గొఱ్ఱెలమందల మేపుచుండగా కొండ ధగధగ మండినట్లు కాన్పించెను. అంత మోషే చిత్రమేమని కనుగొనవెళ్లగా ప్రభువు మోషే! మోషే! నీవు నిలుచున్నస్థలము పరిశుద్ధమైనది. నీ కాలి చెప్పుల విడిచి రమ్మనగా మోషే ఆలాగు చేసెను. అంత ప్రభువు మోషే! ఐగుప్తునందున్న నా స్వజనము మిగుల బాధపడుచున్నది. వారిబాధ నే జూడజాలను. నీవు వెళ్లి వారిని విడిపించుమని యాజ్ఞాపించగా నందుల కాతడు తన కంతశక్తి లేదనియు తనవల్ల గాదనియు పెక్కుసారులు చెప్పినను యెహోవా ఆతని చేతనున్న కర్రచే కొన్ని అద్భుతములు చేయుశక్తినిచ్చి నేను నీకు సహాయము చేసెదను. ఐగుప్తునందలి నీ యన్నయగు అహరోనును వెంటబెట్టుకొని

వెళ్లి ఫరోయొద్ద సెలవుదీసికొని నా జనమునకు విమోచన గలిగింపుమని చెప్పెను. మోషే మొదట ఇబ్రీయులగు ప్రభు స్వజనముకడకేగి ప్రభువు వారిపై జాలిపడి, వారి కష్టములనుండి నివారణగలుగజేయ బోవుచున్నాడని తెలిపి, అన్నను వెంటబెట్టుకొని ఫరోయొద్దకు వెళ్లి సెలవడిగెను. ఫరో సెలవీయకపోగా ఆతని దేశమునకు పదితెగుళ్లు వచ్చునట్లుచేసి ఫరోకు ఇశ్రాయేలీయులు తనదేశములో నుంచుట కయిష్టము పుట్టించివారిని తనతో వెంటబెట్టుకొని నలుబది వత్సరములు అరణ్యమార్గముగా కానానునకు కొంచుబోవుచుండగా జనములు ఆహారములేదని త్రాగ నీళ్లులేవని చెప్పి యాతనిని మిగుల విసికించినను శాంతమూర్తియగు మోషే సమస్తము తాలిమితో నోర్చుకొనెను. ఈ అరణ్యమున పగలు ఎండదెబ్బ తగులకుండా మేఘస్తంభమును, రేయి చీకటిగాన వెలుగునిచ్చు అగ్నిస్తంభమును ప్రభువు వారికిచ్చి నడిపించెను. ఇచ్చటనే వారికి పదియాజ్ఞల నిచ్చెను. ప్రభువు వారినంత ప్రేమించినను వారన్యదేవతల పూజించి ప్రభుని దుఃఖపరచిరి. మోషే వారి మేలునకై నలుబది సంవత్సరములు సేవచేయుచు, చేరవలసిన స్థానమునకు నడిపించుచు సాగిపోవుచుండెను. ఒకనాడు కోపమువచ్చి నీళ్లకై కొండను కొట్టగా నీళ్లువచ్చెను. జనములు త్రాగి తృప్తిపొందిరి.

ఈ పనిని ప్రభువు ఆజ్ఞకు వ్యతిరేకముగా జేసినందున ఇతనికి కానాను ప్రదేశమును సీనాయిపర్వతమునుండి చూపి అచ్చటనే మరణము నొందునట్లు ప్రభు వాతని శిక్షించెను. అతనిని దూతలే భూస్థాపనము జేసినట్లు వేదగ్రంథమున వ్రాయబడియున్నది. ప్రియ చదువరులారా! మోషేకున్న శాంత సహనములు మనకునుండ ప్రయత్నింతము.

---

# బాలమిత్ర టపా

ప్రియ బాలమిత్రులారా!

ప్రియమైన బాలమిత్రను చదివెడి బాలికా బాలురారా! సుమారు నాలుగు మాసములనుంచి ఈ పత్రికలను నేను చదువుటవలన యిట్లు వ్రాయుటకు నాకు ఉల్లాసము కలిగెను. నేను సి. ఎమ్. ఎస్. ఎలిమెంటరీ స్కూలులో 3 వ తరగతి చదువుచున్నాను. ఆ తరగతిలో నేనే మొదటి చిన్నవాడను. మా తరగతిలో 5 గురము మొగ చిన్నవాండ్రము, ఒక ఆడ పిల్ల. మా యుపాధ్యాయుల వారిపేరు టి. బెంజమీనుగారు. మాబడి అధికారులపేర్లు శ్రీ రవరెండు జాక్ కేయిన్ దొరవారున్ను, శ్రీ కేయిన్ దొరసానమ్మగారున్ను, మాబడి స్థాపించి నాలుగు సంవత్సరములు అయినది. అంతకుపూర్వము పిల్లలమైన మాకు చదువనగా మంచి చెడ్డలు అనగా ఏమిటో ఎంతమాత్రము తెలియకుంటిమి. దైవకృపవలన ప్రభువే మాకు యింత మేలును కలుగజేసెను. గాన మీరున్ను, మేమున్ను దేవునికి కృతజ్ఞత స్తోత్రములు చెల్లించుదము.

మా పంతులమ్మగారిపేరు ప్రేమవతమ్మగారు. ఆమె మాయొక్క సండే స్కూలు పంతులమ్మగారు ప్రతి ఆదివారము ఆమె మాకు మంచి దైవ సంగతులు నేర్పించుచున్నారు. ఆమెవల్లనే తెలుగు కీర్తనలు, కథలు, ఉపమానములు, అద్భుతములు కొన్ని ప్రార్థనలు, పదిఆజ్ఞలు కొన్ని వచనములున్ను నేర్చుకొన్నాము. ఇప్పుడుకూడ కొన్ని సంగతులు నేర్పుచున్నారు.

నాకు ఒకటే విచారము. ఏమనగా నేనున్ను నాతోబుట్టువులును నా తల్లిదండ్రులును అన్యులమే. ప్రభువు తన తట్టుకు మమ్ములను ఎప్పుడు తిప్పుకొనునో తెలియదు గాన మీరు దయతో అందరి విషయమై మీ స్వంత ప్రార్థనలలోను, మీ కుటుంబ ప్రార్థనలలోను, ప్రతిదినము దేవునితో మనవి చేయగలందులకు మిక్కిలి వినయముతో బ్రతిమాలుకొనుచున్నాను. మా బడి సంఖ్య హెచ్చు అయ్యేలాగున్ను ప్రతిదినము మేమందరము క్రమముగా ఉదయ సాయంత్రము బడికి వచ్చేలాగున్ను, మాకు మంచి తెలివితేటలు కలిగేలాగున్ను మాకు బోధించే మా పంతులుగారికి మంచి తెలివి జ్ఞానము కలిగేలాగున్ను ఈ పత్రికను చదివెడి మీరందరును దయతో దేవుని అడుగగలందులకు మిమ్ములను వినయముతో బ్రతిమాలుకొనుచున్నాను.

బడిపిల్లలమైన మేమందరమున్ను అన్యులమే మా గ్రామస్థులందరున్ను అన్యులే, మా పంతులుగారి కుటుంబము మాత్రమే క్రైస్తవులు.

మీకు నా ప్రేమ సలాములు.

ఇట్లు మీ ప్రియ బాలమిత్రుడు,

యెన్న వీరాస్వామి, గవిరిదేవి పేట,

భద్రాచలం తాలూకా, గోదావరిజిల్లా

C. L. S. PRESS, MADRAS—1916